# జమీన్‌రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు — సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 19
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 46
14-11-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


## ఇద్దరికీ ఇది పరీక్షాసమయం!

### మండల ఎన్నికల్లో గెలవలేకుంటే రామారావు రాజ్యం చేయలేడు- వెంగళరావుగారు మంత్రిగా వుండలేడు

మా హైదరాబాదు ప్రతినిధి

ఇద్దరు నాయకుల చుట్టూ ఇక్కడ రాష్ట్ర రాజకీయాలు పరిభ్రమిస్తున్నాయి. ఒకరు తెలుగుదేశం నాయకుడు, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు; రెండవ వ్యక్తి ఇటీవలనే కేంద్ర పరిశ్రమలశాఖ మంత్రిగా పదవీ స్వీకారం చేసిన ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు. గడచిన నాలుగేళ్ళుగా రాష్ట్ర రాజకీయాలు రామారావు చుట్టూ తిరుగుతున్నాయి. ఒక విధ్ధయానికి కేరా ఒక వివాదానికి కేంద్ర బిందువు ఆయనే! రామారావుతో సరితూగగలిగిన రాష్ట్రస్థాయి నాయకత్వం కాంగ్రెస్‌కు లేకనే కారణంతో ప్రధాన మంత్రిగా వున్న కాంగ్రెస్ నాయకులతో ఆయనను సరితూల్చే ప్రయత్నాలూ జరిగాయి.

అయితే జాతీయ రాజకీయాలలో ప్రవేశించగల తాకత్, ఖ్యాతి రామారావుకు క్రమేపీ తగ్గిపోవడమే కాకుండా, రాష్ట్రంలో సైతం తనస్థానాన్ని పదిలం చేసుకోవడానికి పోరాడవలసిన అగత్యకర స్థితిలో రామారావు పడిపోయారు. ఈ దశలో రామారావుకు పోటీగా రాష్ట్ర నాయకుడ్ని ఒకర్ని ప్రోత్సహించాలన్న ఆలోచన కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికి కలిగినట్లు వెంగళరావును కేంద్రమంత్రిగా నియమించడం, అదే సమయంలో ఆయన పిసిసి అధ్యక్షుడుగా కూడా కొనసాగించడంవల్ల అనుకోవలసి వస్తున్నది. వెంగళరావుకంటే సీనియర్లు రాష్ట్ర రాజకీయాలలో లేరని దీని అర్థం కాదు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి విషయమే తీసుకున్నా, ఆయన వెంగళరావుకంటె అధికంగా పదేళ్ళపాటు రాష్ట్రాన్ని పరిపాలించిన నాయకుడు, తర్వాత కేంద్రమంత్రిగా కూడా పనిచేశారు, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షతను నెరపారు. ఏడు పదుల వయసు దాటినప్పటికీ ఆయన ఈనాడుకూడా ఉల్లాసంగా చురుకుగా రాజకీయ కార్యకలాపాలలో పాల్గొంటున్నారు.

అయితే బ్రహ్మానందరెడ్డి తరం రాజకీయాలకు అప్పుడు కాలం తీరింది. కాలంతోపాటు రాజకీయ పద్ధతులు, విధానాలు మారుతున్నాయి. అట్లని, వెంగళరావు పసివాడేమీకాదు. ఆయనకూ 65 ఏళ్ళు! అయితే ఆయనకు 1978 నుంచి 84 వరకు ఆరేళ్ళ అజ్ఞాతవాసం అదృష్టంవశా కలిసివచ్చింది. ఈ ఆరేళ్ళ కాలంలో ఆయన కాంగ్రెస్‌కు దూరంగా, మౌనంగా వున్నారు. అందువల్ల రాజీవ్ గాంధి దేశాధినేత అయినప్పుడు ఆయనకు ఈ పరిస్థితి లాభించింది. ముఖ్యమంత్రిగా వున్నప్పటి మంచిపేరు అట్లనే వుండిపోవడంతో రాజకీయ పునర్జన్మ సులువుగా జరిగిపోయింది. పార్లమెంట్ ఎన్నికల్లో గెలవడమేకాకుండా, పి సి సి అధ్యక్షతకూడా సాధించడంతో తెలుగుదేశం హయాంలో ఎటువంటి ఎదురుదెబ్బ తినని ఏకైక కాంగ్రెస్ సీనియర్ నాయకుడిగా ఆయన అధిష్ఠానవర్గానికి కన్పించారు. అందుకే రామారావుకు ప్రత్యర్థిగా, ప్రత్యామ్నాయ నాయకుడిగా, కాంగ్రెసును కష్టకాలంలో నడిపించగల సమర్థుడుగా ఆయనను అధిష్ఠానవర్గం నిలబెట్టింది.

ఇప్పుడు ఇటు రామారావుకు అటు వెంగళరావుకు రానున్న మండలాల ఎన్నికలు పెద్ద అగ్నిపరీక్షగా పరిణమిస్తున్నాయి. తగ్గిపోతున్నదని భావిస్తున్న తన సమ్మోహనా శక్తి చెక్కు చెదరలేదని మరొకసారి మండల ఎన్నికలద్వారా రామారావు నిరూపించుకోలేకపోతే ఆయన కష్టాల కడలిలో మునిగిపోతారు. ప్రజలలో ఆయన బలం సన్నగిల్లిందంటే పరిపాలనలో ఆయన బలహీనం అవడం అటుంచి, పార్టీపై కూడా పట్టు సడలిపోతుంది. ఆయన ఎంతోకాలం పార్టీని అదుపుచేయలేక పోవచ్చు. 1984 లో అసెంబ్లీని రద్దు చేసి మధ్యంతర ఎన్నికలు జరపడానికి ముందు కొద్దినెలలపాటు నెలకొన్న విశృంఖల స్థితి మళ్ళీ పునరావృతమయ్యే ప్రమాదం వుంది. అందువల్ల ఆయన ఈ ఎన్నికలలో గెలవడం ఎంతో ముఖ్యం.

వెంగళరావు పరిస్థితికూడా అంతే! రాష్ట్రంలో పలువురు కాంగ్రెసు నాయకులు ఏ పదవిలేక అవస్థలుపడుతుంటే, వున్న కొద్దిపాటి పదవులను ఒక్కొక్కరికి రెండేసిపోత్వన ఇవ్వడంఅధిష్ఠానవర్గానికి సరదామాత్రం కాదు: ఇతరులకు ఇవ్వకూడదన్న పంతంకూడా వారిలో లేదు. ఎవరో ఒకరిని కాంగ్రెస్ నేతగా స్థాయి పెంచి నిలబెడితేతప్ప ప్రజలు రామారావును కాదని కాంగ్రెస్‌కు పట్టంకట్టరనే వ్యూహంతోనే వెంగళరావుకు రెండుపద

—కొరవ 7వ పేజీలో

# జమీన్‌రైతు

## ఇదొక పిచ్చిపని!

ముఖ్యమంత్రి రామారావుగారి మస్తిష్కంలో తళుక్కున మెరిసే సవాలక్ష ఆలోచనల్లో, కార్యక్రమాల్లో ఒకటి. చౌకడిపో కార్డులకు వారివారి ఫోటోలు కలిపించాలనడం!

ఇదొక పిచ్చిపనితప్ప దీనివల్ల ఎటువంటి ప్రయోజనమూ లేదు. దొంగ కార్డులు లేకుండాచేయడానికి, ప్రభుత్వం సరఫరాచేసే బియ్యం చక్కెర వంటనూనె వగైరాలు దుర్వినియోగం కాకుండా వుండడానికి ప్రభుత్వ ఆలోచనకొచ్చిన పకడ్బందీఏర్పాటు ఈఫోటోల కార్యక్రమం!

కాని ఫోటోలు కార్డులకు అంటించినంతువల్లనే దొంగ కార్డులు లేకుండాపోతాయా? చౌకడిపోలకు సరఫరా అయ్యే నిత్య జీవితావసర వస్తువులు దుర్వినియోగం కాకుండా పోతాయా? ప్రభుత్వం నిజంగానే సత్ఫలితాలు కలుగుతాయని ఈ కార్యక్రమాన్ని తలపెట్టిందా లేక ప్రజోద్ధరణకు ఏవేవోచర్యలు తీసుకుంటున్నట్లు భ్రమింపజేయడానికి ఆర్భాటం ప్రదర్శించే మామూలు వ్యవహారమా? అదీకాకుంటే ఫోటోగ్రాఫర్ల జేబిలు నింపడానికి, కార్డుకు ఐదురూపాయలవంతున పేదసాదా రక్తం పిండడానికి వుద్దేశింపబడిందా? చౌకడిపో కార్డులకు ఫోటో అంటించడమంటే ఇటువంటి సందేహాలు తప్పటంలేదు.

దొంగకార్డులు లేకుండాచేయడానికి ఫోటోలు మార్గంకాదు; ఫోటోలవల్ల వాటిని అరికట్టలేరు. జనాభా ఎక్కువగావున్న పెద్దపెద్ద పట్టణాలలో ఒకవేళ మనిషిని గుర్తించడానికి కార్డుమీద ఫోటో వుండటం అవసరం కావచ్చుగాని, పల్లెల్లో పనిలేదు. గ్రామాలలో డీలరుకు ప్రతికుటుంబము, ఆ కుటుంబంలోని సభ్యులు, వారిసంఖ్య తెలియకుండా వుండదు; ప్రతిఒక్కరితో వారికి పరిచయముంటుంది; ఒకరిపేరుతో ఇంకొకరు తీసుకపోవడానికిగాని, లేదా లేని వ్యక్తుల పేరుతో కార్డులు తీసుకోడానికిగాని అవకాశమేలేదు. ఇప్పుడు దొంగ కార్డులున్నా డీలర్ల ఎరుకతో వుండవలసిందే, వారి లాలూచీ తో వుండవలసిందేకాని, వారికి తెలియకుండా వుండడానికే వీలులేదు. అంతేకాదు, కుటుంబంలో వున్నవారికంటే ఎక్కువమంది సభ్యులను నమోదుచేయటంసైతం డీలర్లకు తెలిసే జరగాలి. అందువల్ల రేపు ఫోటోలపద్ధతి ప్రవేశపెట్టినా దొంగకార్డుల బెడద తప్పిపోతుందనే నమ్మకమేముంది?

దుర్వినియోగం విషయమూ అంతే. పేదప్రజల సహాయానికని ప్రభుత్వం కోట్లకొలది ధనం చౌకడిపోలమీద వ్యయపరుస్తున్నదిగాని, పూర్తి ప్రయోజనం ప్రజలు పొందలేకపోతున్నారు; దీని లాభాన్ని డీలర్లు, వుద్యోగులు, హోల్‌సేలర్లు అనుభవిస్తున్నారు. ఇది అందరికీ తెలిసిన సత్యం.

దొంగకార్డుల నివారణకుగాని, దుర్వినియోగం అరికట్టబడడానికిగాని ఫోటోలపద్ధతి మార్గంకాదు. పట్టణాలలోకాని, గ్రామాలలో గాని కుటుంబాలు, అందులోని సభ్యుల సేకరణ, తదనుగుణంగా కార్డుల పంపిణీ సక్రమంగా జరపగలిగిన, అప్పటప్పుడు ఆ కార్డులను పరిచూడగలిగిన నిజాయితీపరులైన వుద్యోగులతోకూడిన ప్రత్యేక యంత్రాంగం కావాలి. అట్లనే ఇస్తున్న కోటాను డీలర్లు ప్రతినెలా తీసుకపోతున్నారా లేదా, తీసుకపోయిన వస్తువులను కార్డులననుసరించి పూర్తిగా పంపకం చేస్తున్నారా లేదా అని తనిఖీ చేయగలగాలి; తరచు పంపకంవిషయం ఏవిధంగావుండేది ప్రజలను విచారించేటట్లు వుండాలి.

అటువంటి కట్టుదిట్టమైన ఏర్పాటు లేనందువల్లనే, చౌకడిపోల వ్యవహారం అబందర అయిపోయింది; కోట్లు తగలెయ్యటం తప్ప దాని ప్రయోజనం పూర్తిగా ప్రజలకు చెందకుండా పోతున్నది. ప్రత్యేక యంత్రాంగాన్ని నియమించి, అవినీతికి ఆస్కారంలేని పద్ధతిలో వాటిని నిర్వహించగలిగితేతప్ప, ఫోటోలు దొంగకార్డులను, దుర్వినియోగాన్ని నివారించలేవు.

## జమీన్‌రైతు

13 11 1936

### నెల్లూరు ముచ్చట్లు

కాకరాపత్తి కాధిపురాలు పాటూరు బాలసరస్వతమ్మగారి అల్లుడు ఎస్. ఎ. ఎల్. నారాయణరావుగారు, బి. ఎ ఎల్ ఎల్.బి ఎల్. పరీక్షల్లో రాజధానికి ప్రథమస్థాన మాక్రమించి మన రేవాం మెడల్, ముత్తుసామయ్యర్ మెడల్, మరొక మెడల్ సంపాదించిన విద్యార్థికుని జిల్లాంటాక్ట్ ఆఫీసరుద్యోగమైందనే సంతోష వార్తను కాంగ్రెసు భావంతో పరిహరిస్తుందా కాంగ్రెసు భావంతో కౌగలిస్తుందా సింహపురిమాత?

• • •

రైలు పెట్టెల్లో మాదిరి కాంగ్రెసు ఆఫీసులో గూడ "దొంగలున్నారు జాగ్రత్త" అని బోర్డు వ్రాయించి కట్టటం మంచిదేమో? పోటీలేక గెల్చిన 22 మందిలో కాంగ్రెసు వాళ్ళ అని బహిరంగముగా చెప్పుకో తగినవారు 15 మంది, నాలుగు మందిని అనుమానంలో వేయవచ్చు. పోటీ చేస్తుంటేవారినుండి అధమం కాంగ్రెసుకు నికరముగా వచ్చేవి 13 కు తగ్గవు. లేదు. 15 తో 13 చేరి 28 మంది నికరంగా వస్తారని బల్లగుద్ది చెప్పొచ్చు. గెల్చిన వారిలో 4 గురు అనుమానస్తులున్నారే గాని గెల్వలేకపోయ్యే వారిలో అసంఖ్యాకులుగా లేదనాలి. అనుకోనివి ఒకటి రెండు వచ్చినా రావచ్చు మొత్తంమీద కాంగ్రెసు పట్టుకు నెట్టుంది బోర్డును తర్వాత యాక్యరేద్ప.

• • •

యెలిసవారి దూతమాకినేని

## 50 ఏళ్ల క్రితం ఈవారం

నర్సయ్యగారు కనిగిరి హోటల్లో భట్టుకశెట్టి కృష్ణయ్యతో "అబ్బే కాంగ్రెసు అర్హర్థిగా నిల్వవద్దు" అని ధర్మోపదేశం చేశారటనే! నర్సయ్యగారూ! ఆ కాంగ్రెసు, జమీన్‌రైతు సంఘాలనేవే లేకుంటే కంట్రాక్టు లెక్కలవయ్యా! తమమామ బ్రతికి వుండగా ఆ రైతు సంఘాన్నుండి మాన్పించడానికేగా కాటూరివారి పాళెంలో యిండ్లు కట్టుకోను స్థలం ప్రసాదించింది. దాని మహత్యం యింతలోపల్నే మరచిపొయ్యావా?

నీ ప్రస్థానం ఇప్పుడే అన్ని చెప్పక పుస్తకం గురించి, దాని విలువ ఏ బాగ

అల్లప్రసాద్-నెల్లూరు

### సువర్ణపతక బహూకరణ మహోత్సవము

నెల్లూరు ప్రిన్సిపల్ సబ్ జడ్జిగారగు శ్రీ ఎస్. ఎస్. నరసింహాచారిగారు శ్రీయుతులు ముంగమూరు నరసింహారావుగారి వకన నైపుణి మెచ్చి యిచ్చిన సువర్ణపతకమును ఈనెల 21 వ తేది పురమందిరమున 6 గం॥ జరుగనున్న సారమహాసభలో నెల్లూరుజిల్లా జడ్జిగారైన శ్రీ పి. ఎస్. రామస్వామిగారు సమర్పింతురు.

### నెల్లూరుజిల్లా నేత పారిశ్రామిక మహాసభ

నెల్లూరుజిల్లా నేత పారిశ్రామిక మహాసభ యీనెల 16 తేది సోమవారం కోవూరు గ్రామంలో కుప్పం నగర వాస్తవ్యులగు శ్రీయుత వి. రాధాకృష్ణ శ్రేష్టిగారధ్యక్షతన జరుగును. గుంటూరుజిల్లా చీపురిపాలెం తంతా యతిబోర్డు అధ్యక్షులగు శ్రీమాన్ అకురాతి రంగనాయకులుగారు సభా ప్రారంభోత్సవము జరిపెదరు. ఇతర గ్రామాలనుండి వచ్చువారికి భోజన సౌకర్యము లేర్పరుతలదును.

# ఆర్టీసి టౌన్‌బస్సుల దోపిడీ!

కోవూరుకు 1 తేదినుండి కొన్ని టౌన్ బస్సులను ఆర్టీసి ప్రవేశపెట్టింది, వీటిల్లో ఛార్జీలు ఎక్కువగావున్నాయి. వాటిని ఎప్పటికో సవరిస్తారట. ప్రైవేటు బస్సులతో సమానమైన రేట్లతో ఆర్టీసి బస్సులు నడిపితే సముచితంగా వుండేది. అందుకనే ఒకితక్కువ ప్రయాణీకులతో తిరుగుతున్నాయి. ఆర్టీసి వారి పద్ధతి చూస్తుంటే దోపిడిలావుంది. విద్యార్థులు, ప్రభుత్వోద్యోగులు సీజన్ టిక్కెట్లు పొందగలరు. కాని, నిత్యం నెల్లూరుతో సంబంధం వుండే చిన్న వ్యాపారస్తులు, వృత్తిపనివారు తదితరులు ఇంత అదనపుభారాన్ని భరించడం కష్టం. ఆర్టీసివారు ఛార్జీలను ప్రైవేటుబస్సులతో సమానంగా వుండేలా చూడాలి. లేకపోతే ప్రజానిరసనను ఎదుర్కోవలసివస్తుంది.

కోవూరు -ఎం. ఎం. రజాక్ మొహిద్దీన్

## పసిబిడ్డల్ని రక్షించండి!

జిల్లాలోని ప్రజలు మెదడువాపు వ్యాధిని గురించి భయాందోళనతో వున్నారు. ఈ వ్యాధి నిర్మూలనకుతగిన వైద్యసదుపాయాలు లేవనే చెప్పాలి. అపరిశుభ్రమైన వాతావరణం, పందులు, దోమలు ఇందుకు కారణమని తెల్పినా వాటి నిర్మూలనా కార్యక్రమం మాత్రం శూన్యం. పల్లెల్లో నిరక్షరాస్యులైన ప్రజానీకం ఈ విషయాన్ని గురించి శ్రద్ధ




-కొరవ 10వ పేజీలో

## మేము-మీరు

### అనుభవాలు బాగున్నాయి

వరుసగా నాలుగువారాలపాటు ప్రచురించిన శ్రీ దరిమడుగు కామయ్య (రిటైర్డ్ డిప్టీ సెక్రటరీ) 'అధికారి అనుభవాలు' చాలబాగున్నాయి, ఆనాటి రెవిన్యూకు సంబంధించిన విషయాలు తెల్పుకొని ఆనందించాను జమీన్‌రైతులో అన్ని శీర్షికలు బాగుంటున్నాయి కాని, సినిమా శీర్షికలో ప్రచురించే వార్తలు, చిత్రసమీక్షలు ఎబ్బెట్టుగా, అతిశయోక్తిగా వుంటున్నాయి, ఈ శీర్షికలో వాస్తవ విషయాలకు ప్రాధాన్యత ఇవ్వవలసిందిగా మీ అభిమానిగా కోరుచున్నాను;

నెల్లూరు -కె.వి.యస్. రావు

# ఉత్తరక్రియలు

మా తల్లి

## సోమిరెడ్డి కృష్ణమ్మగారు

**6-11-1986** తేది గురువారం స్వర్గస్తురాలైనది.

ఆమె ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

### ఉత్తరక్రియలు

22-11-1986 తేది శనివారం నిలుపు

23-11-1986 తేది ఆదివారం ఎత్తురేపు

అల్లీపురంగ్రామంలో మా స్వగృహమున జరుగును.

కావున తెలియజేయుడమైనది.

సోమిరెడ్డి రాధాకృష్ణారెడ్డి

కుటుంబ సభ్యులు

సోమిరెడ్డి చంద్రశేఖరరెడ్డి, సోమిరెడ్డి వెంకటకృష్ణారెడ్డి

సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి

దువ్వూరు కౌసల్యమ్మ, దువ్వూరు సరోజనమ్మ

# అదనపు సౌకర్యాల్లేకుండా అదనపు భారమేస్తున్నారు!

పంచ రంగుల ప్రభుత్వ వాహనాలతో నెల్లూరు టౌను కళకళలాడుతూంది; కన్నుల పండువుగా తయారైంది. ఎన్నో ఏళ్ళ ఎదురుచూపు తర్వాత, ఇప్పటికైనా ఆర్టీసీకి నెల్లూరుపై కనికరం కలిగింది. గౌరవ విషయమే. ఒక్కసారిగా 16 సర్వీసు బస్సులు రోడ్డు పైకి ప్రవేశించింది. అటూ ఇటూ విరామం లేకుండా తిరగడంతో మనపట్టణానికి పెళ్ళికళ వచ్చింది.

నెల్లూరుటౌనులో మొత్తం రూట్లలో 37 టౌను బస్సులు తిరుగుతుండేవి. వాటిలో 14 రూట్లను స్వాధీనం చేసుకుని 16 బస్సులు ప్రవేశపెట్టింది ఆర్టీసి. నిజానికి మనకు ఎప్పుడో రావలసిన సౌకర్యం ఇది. నెల్లూరుకంటే చిన్నపట్టణాలలో కూడా సంవత్సరాల క్రితమే ఆర్టీసి బస్సులు తిరగడం మొదలెట్టాయి. ఇన్నేళ్ళకైనా అవి నెల్లూరుకు వచ్చినందుకు సంతోషమే కాని, ఆ ప్రవేశం సమగ్రంగా, సౌకర్యవంతంగా, సక్రమంగా లేదన్నదే బాధ.

ఒక్క చార్జీ విషయం మినహాయిస్తే (అది మినహాయించాల్సిన సర్వసాధారణ విషయం కాదనుకోండి) ఇతరత్రా అంతా ఆర్టీసి బస్సులే ప్రయాణీకులకు సౌకర్యంగా వున్నాయి.

ఇప్పుడు వేసిన పన్నెండు క్రొత్త బస్సులు పైగా ప్రైవేటు వాహనాలు: రకరకాల రంగులు పులుముకుని, కొత్త కరకు మాయకుండా కళకళలాడుతూ, మిలమిల మెరుస్తున్నాయి. సీట్లుకూడా 'ఎక్స్‌ప్రెస్' స్థాయిలో వుండడంతో ప్రయాణం సుఖంగా వుంది.

## నెల్లూరు టౌనులో ఆర్టీసీ బస్సులు

ప్రైవేటు బస్సులకు, వీటికి ప్రధాన తేడా - సిబ్బందే! నెల్లూరు టౌను బస్సుల సిబ్బంది మొరటి మంచి సంస్కారానికి పెట్టింది పేరు. ఒకరికిద్దరు చెకింగ్‌లు కండక్టరు, క్లీనరులు బస్సునెక్కి అరుపులు, కేకలతో నానారభస సృష్టించడం ప్రయాణీకులను మర్యాదలేకుండా లోపలకు త్రోయడం, ఆడవారినీ కూడా అమర్యాదకరంగా నెట్టడం వారి సహజ లక్షణాలు; ఎవరైనా తిరుక్కుని ప్రతిఘటించబోతే, మూకగా పైకలసి కరుస్తారు. ఆర్టీసి బస్సులలో ఈ పీడలేదు.

ప్రైవేటు బస్సుల దురుసుతనం కూడా వీటిలో లేదు. యముని మహిషపు లోహ గంటలు ఖణేల్ మన్నట్టు రేకుడబ్బాలను చరుస్తూ, రోడ్డుకు రెండువైపులా జనాన్ని బెదిరిస్తుకొడుతూ, సర్రున దూసుకుపోయే దృశ్యాలు మనందరికి సుపరిచితమే; కాని ఆర్. టి. సి. బస్సులుమాత్రం ఒద్దిగ్గా, బుద్ధిగా తిరుగుతున్నాయి.

వీటితో వచ్చిన కష్టమల్లా, చార్జీలదే. ప్రైవేటుబస్సుల్లో మినిమంఛార్జీ 40 పైసలు; వీరు 75 పైసలు గుంజుతున్నారు. అచ్చయినటిక్కెట్లు రాలేదని సాకుచూపుతున్నారట. దీనిఫలితంగా మామూలు ప్రైవేటు బస్సుల్లో 70 పైసలిస్తే గాంధి బొమ్మవరకు రాగలిగితే, ఇదేదూరానికి రూపాయి సమర్పించవలసి వస్తుంది. పెద్దాస్పత్రి దగ్గరెక్కి వేదాయపాళెంలో దిగినా, ముప్పావలా ముట్టచెప్పాల్సిందే!

ఆర్టీసి వచ్చి అదనపు సౌకర్యాలు కల్గితే, అందరికీ ఆనందమే కాని, ఈ

కొరవ 11 వ పేజీలో



# నెల్లూరు సంగతులు

### ఎన్. ఎస్. ఎస్. ప్రారంభోత్సవం

వేదసంస్కృత కళాశాలలో 25 తేది ఎన్ ఎస్ ఎస్ ప్రారంభోత్సవ సభ జరిగింది. ప్రిన్సిపల్ శ్రీ కె యస్ రామానుజాచార్యులు సభకు అధ్యక్షత వహించారు. ప్రజావైద్యశాల, డాక్టర్ ఐ. సుధాకర్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీ వి వి సుబ్రహ్మణ్యం, ప్రోగ్రామ్ ఆఫీసరు శ్రీ వి బాలసుబ్రహ్మణ్యం మాట్లాడారు. శ్రీ ఎమ్.వి. రమణయ్య వందనాలు చెప్పారు.

### కళామందిర్ నృత్యపోటీలు

కళామందిర్ సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో ఇటీవల రెండు రోజులు నృత్యపోటీలు టౌనుహాల్లో జరిగాయి.

మొదటిరోజు సభకు జిల్లా సెషన్స్ జడ్జి శ్రీ బి. శివసాంబమూర్తి అధ్యక్షించారు. ఆంధ్రజ్యోతి విలేఖరి శ్రీ జి. వి. రమణయ్య, ఆకాశవాణి కళాకారుడు మాస్టర్ అంజనేయులును ఎమ్మెల్యే శ్రీ కె. వి. సుబ్బారెడ్డి సన్మానించారు. తర్వాత శ్రీ రామాంజనేయయుద్ధం నాటకం ప్రదర్శించారు.

రెండవరోజు సభలో జిల్లా జైల్ సూపరింటెండెంట్ శ్రీ సి. గురవలయ్య తదితరులు మాట్లాడారు. తర్వాత నృత్యపోటీలలో గెలుపొందిన విజేతలకు బహుమతులు పంచిపెట్టారు.

### ఇందిరాగాంధీ ద్వితీయ వర్థంతి

సంజయ్‌గాంధి చేనేత సంఘం ఆధ్వర్యంలో స్వర్గీయ ఇందిరాగాంధి ద్వితీయ వర్థంతి సందర్భంగా మెకాలే ఇంగ్లీషు మీడియం స్కూల్‌లో పేదలకు అన్నదానం చేశారు. తర్వాత జరిగిన సభకు శ్రీ దర్శి నారాయణశెట్టి అధ్యక్షత వహించారు. సింహపురి పత్రికాసంపాదకులు శ్రీ అకుల సుబ్రహ్మణ్యం, సంఘ కార్యదర్శి శ్రీ యస్. రామారావు మాట్లాడారు.

### ఆర్మీ రిక్రూట్‌మెంట్

గుంటూరు, బ్రాంచి రిక్రూటింగ్ ఆఫీసు ఆధ్వర్యంలో 17 తేది నెల్లూరు ఆర్. అండ్ బి గెస్టుహౌసులో ఆర్మీ రిక్రూట్‌మెంట్ సెలక్షన్ జరుగుతుందని జిల్లా సైనిక వెల్ఫేర్ ఆఫీసర్ చెప్తున్నారు. ఇతర వివరాలకు ఆయన్ను సంప్రదించండి.

## కొసరాజుకు స్మృత్యంజలి

-మల్లెమాల

మతిమెత్తని జనములతో  
చతురోక్తుల రంగరించి చాటువులెన్నో  
అతులితరీతిని చెప్పిన  
మతిమంతుడు శాశ్వతముగ  
మౌనము దాల్చెన్॥

దినమొలతో తిరుగాడుచు  
ముసినవ్వులలోటి మనల ముగ్ధుల చేసే  
పసిపాపలవని కవితల  
కొసరాజు సమాన ప్రతిభ కొల్లగతరమే॥

తెరమరుగున పడిపోయిన  
అరుదగు మాటలకు ఆశాయువుపోసి  
శిరమెత్తిన ఆ తెలుగుతెకు  
స్థిరకీర్తిని అతనికిలను చేకూర్చునోకో॥

(కొసరాజు రాఘవయ్యచౌదరిగారికి అశ్రుతర్పణమిస్తూ, సినీ నిర్మాత శ్రీ మల్లెమాల సుందరరామరెడ్డి వ్రాసి పంపిన గేయమిది).

### త్యాగరాజ ఆరాధనోత్సవాలు

బాలాజీనగర్ శ్రీ సీతారామస్వామి

—కొరవ 11వ పేజీలో



## ●● సంస్మరణ ●●

శ్రీమతి  
పి. ఉమామహేశ్వరి

నీవు జీవించింది కొద్దికాలమే  
అయినా మా అందరిపైనాశాశ్వత  
మైన చెరగని ముద్రవేశావు.  
నిన్ను మనసారా స్మరించుకుంటూ  
నీ స్మృతులను కలకాలం మా  
హృదయాలలో పదిలపర్చుకొని  
నిన్ను ఏనాటికి మరువలేని

జననం: 18-7-64  
మరణం: 15-11-81

నిన్ను పోగొట్టుకున్న  
ప్రతి ఒక్కరం.

# పి డబ్ల్యు డి ఇంజనీర్ల నిర్లక్ష్యంతో వేలాది ఎకరాల పైరు నీటిపాలు!

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డ చందానికి, జిల్లా ముంచిండి నక్కలకాల్వ కలివెళ పాళెం రైతులను. మలమల మాడ్చి వేసే కరువులోకూడా నానా కంటాలుపడి, చుక్క చుక్కగా నీరునంపాదించి కలివెళపాళెం, పెనుబర్తి, కనుపర్తిపాడు తదితర గ్రామాలలో మొలగొలుకు పైరు, బి. ఆర్. 20కి నారు కయ్యలు సాగుచేశారట. మొన్నవచ్చిన వానలకు అవన్నీ వెల్లువ చెల్పుతున్నాయి. ఆ నీళ్ళు పూర్తిగా తీయకముందే, కనుపర్తిపాడు దగ్గర నక్కలకాల్వ కట్టలు తెగి ఎక్కడెక్కడి నీరో వచ్చి నీళ్ళ పొలాలపై పడింది. ఫలితంగా వేలాది ఎకరాలలో పైరు మునిగిపోయి, మురిగిపోయాయి. నారుకయ్యలు పాచిపట్టిపోయాయి. లేతపైర్లన్నీ కుళ్ళిపెట్టుకపోయాయి.

పి. డబ్ల్యు. డి. అధికార్ల అలక్ష్యమే తమపైర్లను నీళ్ళపాలుచేశాయని కలివెళపాళెం మాజీ సర్పంచ్ శ్రీ పోతల వెంకట కృష్ణారెడ్డి ఆరోపిస్తున్నారు. నక్కలకాల్వ ఈ చుట్టుపక్కల పది పదిహేను ఊళ్లకు డ్రైనేజికాల్వ. కనుపర్తిపాడు దగ్గర ఇది నాలుగైదు బ్రాంచి కాలువలుగా చీలుతుంది. అక్కడే ఒక్కొక్క కాల్వకు ఒక్కొక్క తూము వుంటుంది. ఏడెనిమిది సంవత్సరాలుగా ఆలనాపాలనా లేకపోవడంతో అవన్నీ పూడిపోయి వెల్లువనీళ్ళు సక్రమంగా పారడంలేదట.

అధికారులకెందుకు బుద్ధిపుట్టిందో, గత సంవత్సరమే లక్షలు ఖర్చుపెట్టి

### జిల్లా వార్తలు

రిపేరు చేశారట. అందుకోసం బ్రాంచి కాలువల తూములు చెదరగొట్టి, వాటి స్థానంలో ఇసుకబస్తాలు పేర్చిపెట్టారట, పని పూర్తి కాకపోయినందువల్ల కాబోలు: అవి అట్లనే పెట్టారట. మొన్నటి వానలకు ప్రధాన కాల్వకు విపరీతంగా ప్రవాహం వచ్చింది. అయితే తూముల దగ్గర ఎగదన్నడంతో, నీళ్ళుపోయే దారిలేక కాల్వకట్టలు ఐదారుచోట్ల తెగిపోయాయట. దానితో ఎక్కడెక్కడి వెల్లువనీరో ఒక్కసారిగా ఈ పొలాలపై పడింది, సర్వం మునిగిపోయింది.

పి డబ్ల్యు డి ఇంజనీర్లు ముందుగా తూములు కట్టివున్నా, లేక వెల్లువ ప్రమాదం గమనించి ఇసుక బస్తాలు పెరికివేసి వుండినా ఇంత ప్రమాదం తప్పేదని రైతుల వాదన. నిజానికి ఆ తూములపైన ఐదుగురు కళాసులున్నారట. బస్తాలు తొలగించమనే ఉత్తర్వు

—కొరవ 10వ పేజీలో

# రామిరెడ్డిగారి ప్రజ్ఞ సినిమా రంగంలో విఫలమైంది!

కవికోకిల దువ్వూరు రామిరెడ్డి జయంతి సభ 10 తేది టౌన్‌హాల్‌లో జరిగింది. దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి, ఈ సభకు నిర్వాహకులు. మామూలుగా, జయంతి సభలో ఒక ప్రసిద్ధ సాహిత్యవేత్తను సత్కరించడం ఆనవాయితీ: ఈసారిమాత్రం ప్రముఖ విజ్ఞానవేత్త, రిటైర్డ్ లెఫ్టినెంట్ జనరల్ డాక్టర్ బి. దుర్గాప్రసాదరావుకు సత్కారం అందచేశారు. సభకు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

రామిరెడ్డిగారు అసాధారణ ప్రజ్ఞా ధురీణుడని ప్రశంసించారు గోపాలరెడ్డిగారు. ఆయన తన కవిత్వంలో గ్రామీణ జీవితాన్ని ప్రతిఫలింపజేశారు; ఇంకొకవైపు పెర్షియన్‌భాష నేర్చుకొని ఉమర్‌ఖయ్యాం రుబాయీల సారం గ్రహించి అద్భుతమైన పానశాల నిర్మించారు. ఎన్నోభాషలు నేర్చుకున్నారు; చిత్రలేఖనం, శిల్పం, ఇంజనీరింగువంటి శాస్త్రాలనుకూడా స్వయంకృషితోనే అధ్యయనంచేసి, పండితుడుగా పరిణతి నందారు. విజ్ఞానశాస్త్రం లేక వారికెంతో మక్కువ; కానీ అంతటి ప్రజ్ఞాధురీణుడూ సినిమాప్రపంచంలోమాత్రం వైఫల్యాన్ని

### దువ్వూరు రామిరెడ్డి జయంతి సభ

ఎదుర్కోవలసివచ్చింది- అన్నారు గోపాలరెడ్డిగారు.

రామిరెడ్డి జీవితంలో ఓటమినంటూ అనుభవించింది ఈ రంగంలోనే, అన్నారాయన.

శ్రీ దుర్గాప్రసాదరావు పలురకాల వ్యాధులు, వాటి లక్షణాలు, వాటి నివారణకు అవలంబిస్తున్న మార్గాలను గురించి కూలంకషంగా ప్రసంగించారు, విజ్ఞానదాయకంగా సాగింది ఆయన ప్రసంగం.

ఈ సభలోనే రామిరెడ్డి ఆంగ్లగ్రంథం 'వాయిస్ ఆఫ్ ది రీడ్' పునర్ముద్రణ

కొరవ 10వ పేజీలో

# ప్రజాసేవకు పర్యాయపదం రోటరీక్లబ్

రోటరీ, లయన్స్ క్లబ్‌లకు డిన్నర్ క్లబ్‌లని పేరు: వ్యాపారస్తులు పరిచయాలు పెంచుకోవడానికి, అప్పుడప్పుడు పదిమందితో కలసి సరదా కాలక్షేపం చేయడానికి తప్ప, ఇవెందుకు కొరగావనే అభిప్రాయమూ ప్రజలలో వుంది, ఈమధ్య వీటికి "వైద్యశిబిరాల క్లబ్" లన్న పేరుకూడా వచ్చిందనుకోండి!

అయితే గూడూరు రోటరీ క్లబ్‌మాత్రం వీటన్నింటికీ విభిన్నంగా, ఈ అభిప్రా

### గూడూరు న్యూస్

యాలకు సుదూరంగా, ప్రశంసనీయమైన సేవచేస్తూంది, ప్రజాసేవ అంటే వైద్య శిబిరాలు నడపడమనే దురభిప్రాయంతో కాకుండా, పట్టణంలో జరిగే ప్రతి మంచి కార్యక్రమంలో సహకరించడం, తమ సభ్యులను అందులో మిళితం చేయడం ధ్యేయంగా నడుస్తున్నట్టున్నది.

మహిళా కళాశాలకు కొత్త భవనాలు కట్టినా, కళ్యాణమండపం నిర్మిస్తున్నా, స్టేడియం నిర్మాణ సన్నాహాలు జరుగుతున్నా, మరొక అభివృద్ధి కార్యక్రమం మొదలైనా రోటరీ క్లబ్ సభ్యులు తమంతట తాముగా సహకరించడం విశేషమే కదా! ఇవికాక, గూడూరులో కంటి ఆస్పత్రి కట్టడానికి శ్రీ సి. వి. కృష్ణయ్య జైన సంఘానికి ఇచ్చిన ఇస్తానన్న చెరొక లక్షను తీసుకుని, ఆ బృహత్కార్యాన్ని తమ భుజస్కంధాలపై మోయడానికి పూనుకుంటున్నట్టున్నారు,

ఇవికాక మెదడువాపువ్యాధి వంటి విపత్తులు వచ్చినప్పుడుకూడా రోటరీక్లబ్ అందరికంటే ముందుగా రంగంలోకి దూకింది. ప్రజాసేవలో ఇంతగా తల మున్కలౌతున్నారు కాబట్టే- క్లబ్ సభ్యులను, ముఖ్యంగా శ్రీ వై. గోపాలరెడ్డిని- రోటరీ గవర్నర్ శ్రీ కేశవమూర్తి ప్రశంసలతో ముంచెత్తారు. ఆయన, ఆయన సతీమణి శ్రీమతి నాగమణి ఇటీవల గూడూరువచ్చిపోయారు. ఈసందర్భంగా జరిగిన సభలో క్లబ్ అధ్యక్షుడు శ్రీ ఎస్.

—కొరవ 8వ పేజీలో

# నీళ్లకోసం రైతులు గోలపెడుతున్నారు!

మొన్న కురిసిన భారీ వర్షాలకు జిల్లాలో చెరువులకు గండ్లు పడడంతో ఆత్మకూరు తాలూకాకు ఫస్టు ప్రైజు వస్తుంది, ముఖ్యంగా పైగా చెరువులు తెగాయి ఈ తాలూకాలో! ఈ విపరీతమెందుకు సంభవించిందో తెలుసుకోవడానికి కలెక్టరుగారు స్వయంగా ఆత్మకూరుకు వెళ్ళివచ్చారు.

చెరువులకు గండ్లు పడడానికి ప్రధాన కారణం, పి డబ్ల్యు డి అధికారులేనని రైతుల ఆరోపణ. గత తుఫానుకు గండ్లు

### ఆత్మకూరు వార్తలు

పడ్డ చెరువులే ఇవన్నీ! అప్పుడు లక్షలు ఖర్చుపెట్టి పూడ్చిండారు, అయితే, కాంట్రాక్టర్లకు బిల్లుపైన, ఉద్యోగులకు తమ పర్సెంటేజీలపైన తప్ప కట్ట గట్టితనంపై ధ్యాస లేకపోవడంతో, అవి నీళ్ల వేగానికితాళు- గాలి వత్తిడికే కొట్టుకపోయేంత బలహీనంగా తయారైనాయి. ఒక్కసారిగా చెరువు నిండడంతో అడ్రసు లేకుండా పోయాయి.

డి సి. పల్లె, తెల్లపాడువంటి చెరువులకు గండ్లు పడడం ప్రతిసంవత్సరం మామూలే! వానిలి చెరువుకూడా అంతే. వీటన్నిటినీ ప్రతిసంవత్సరం రిపేరు చేసేదికూడా ఒకే కాంట్రాక్టరట,

పోనీ కట్టలు అవకతవకగా పోస్తే పోశారు- కనీసం వానలసమయంలో అవి తెగి ఊళ్ళమీద పడకుండా జాగ్రత్తతీసుకున్నారా అంటే, అదీలేదు అప్పటికి ఒకటిరెండు ఊళ్ళలో రైతులు ముందుగానే వెళ్ళి పి. డబ్ల్యు. డి. అసిస్టెంట్ ఇంజనీరుకు మొరపెట్టుకున్నారట- వాటిని జాగ్రత్తచేయమని; కానీ తెగిన తర్వాత 'పని' 'పర్సెంటేజీ' దొరుకుతాయి కాబట్టి శ్రద్ధవుంటుందికాని, తెగకముందు వారికేమి ఆసక్తి?

ఇప్పుడు చెరువుల్లో చుక్కనీరులేదు. రైతులు అల్లాడిపోతున్నారు కలెక్టరుగారు ఈ చెరువులన్నింటినీ దృఢంగా రిపేరు చేయించి, కనీసం పై ఏడాదికైనా నీళ్ళు నింపుకునేందుకు అవకాశంకల్పించాలి.



# ఈసారి వైశ్యుడికి ఛైర్మెన్ యోగం?

ఎట్టకేలకు జరుగనున్న మునిసిపల్ ఎన్నికలకోసం కావలిలో అన్వేషణ ప్రారంభమైంది. తెలుగుదేశం పట్టణ అధ్యక్షుడిగా శ్రీ కేతిరెడ్డి రామకోటారెడ్డి నియామకం ఈ చర్చలకు, ఊహాగానాలకు నాందిపల్కింది,

డాక్టర్ ప్రభాకరనాయుడు జోడు పదవుల స్వారీచేస్తున్నాడన్న ఆరోపణ రావడంతో, జిల్లా కార్యదర్శిత్వం మిగుల్చుకుని పట్టణ అధ్యక్షతకు రాజీనామా ఇచ్చిననాటినుంచి ఈ పదవి ఖాళీగావుంది. మధ్యలో శ్రీ ఎం. వి. నారాయణ తనకుతానుగా అధ్యక్షుణ్ణని ప్రకటించుకోవడం, ఆ రభస సస్పెన్షన్ వరకు పోవడంకూడా తెలిసిందే! ఇన్ని నెలల విరామం తర్వాత రామకోటారెడ్డి నియామకం, మునిసిపల్ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని జరిగిందేనని రాజకీయవాదుల ఊహ.

నిజానికి రామకోటారెడ్డిగారికి ఛైర్మెన్

### కావలి కబుర్లు

కావాలన్న ఉబలాటం చాలాకాలం నుంచే వుంది. ఆయన మంత్రిగారికి సన్నిహిత బంధువుకూడా; అందువల్లే, ఆయన ఇటీవల జరిగిన జనతా సదస్సులో పాల్గొన్నా, అక్కడివాళ్ళు హైకమాండుకు వెళ్ళినా పదవికాంక్ష మాత్రం ఒడిలో

—కొరవ 10వ పేజీలో



సంస్మరణ ...

1974 సంవత్సరం నవంబర్ 11 తేది

మమ్ములనందరిని దుఃఖసాగరమునముంచి దివంగతులైన

టి. వి. రమణారెడ్డిగారికి

శ్రద్ధాంజలి ఘటిస్తూ -

-కుటుంబ సభ్యులు.

# నెల్లూరు ముచ్చట్లు

## విమర్శకుడు

### విశాఖకార్తెలో వర్షంలేదు!

6 తేదీ రాత్రి విశాఖకార్తె ప్రవేశించింది; 7తేదీ నాలుగు చినుకులు రాలకుండా సన్న మరలా వర్షమే లేదు; పగలు ఎండ, రాత్రి మంచు. 19 తేదీ అనూరాధకార్తె; ఆ కార్తెలో సువృష్టి అంటున్నారు మా శాస్త్రిగారు. అనూరాధ కూడా వర్షం తేకుంటే, స్వాతి వర్షంతో సరి అయితే ఈ సంవత్సరం సరేసరి; వచ్చే సంవత్సరం మరింత గడ్డుగా వుండబోతుంది.

స్వాతి వర్షానికి చెరువులు నిండాయి. ముందు వేసిన మొలగొలుకు పైరు బాగుంది; నిన్నమొన్న కూడా కొందరు మూడు నెలలు పైబడిన నారు నాటుతున్నారు. ఏమైనా వచ్చే సంవత్సరం మొలగొలుకు బియ్యానికి కరువే; ఐ.ఆర్. 20 నాట్లు పోటుతం ముమ్మరంగా సాగుతున్నది.

### ఎన్జీఓల సమ్మె

రాష్ట్ర వ్యాప్తంగా జరుగుతున్న ఎన్జీఓల సమ్మెలో, నెల్లూరు ఉద్యోగులు ఒక్కరు కూడా మినహాయింపులేకుండా పాల్గొంటున్నారు. జిల్లాలో ఏ ప్రభుత్వ కార్యాలయమూ పనిచేయడంలేదు; పీన మెత్తు పని జరగడంలేదు. పి డబ్ల్యు డి లస్కర్లతో సహా సమ్మెకు దిగడంతో రైతులస్థితి దుర్గతి గావుంది. చెరువుకట్టలు తెగుతున్నా పట్టించుకునే దిక్కులేదు; కాలువకు తూములెత్తే నాథుడులేరు. మునిసిపల్ సిబ్బంది సమ్మె పట్టణంలో పౌర జీవనాన్ని దుర్భరం చేసేస్తూంది. ఎక్కడి పెంటకుప్పలక్కడే, ఎక్కడి మురుగుకాలువలు అక్కడే; పరిశుభ్రత అన్నదే లేకపోవడంతో మొన్నటి వానకు కగ్గిన దోమలు తిరిగి ఝుమ్మని ముసురుకుంటున్నాయి. మెదడువాపు వ్యాధి భయం ఒకవంక, ఇళ్లముందు ముక్కులు పగిలే కంపు మరొకవంక- భయంకరంగా వుంది పరిస్థితి మెదడువాపు వ్యాధి నివారణకు కనీసం శానిటరీ సిబ్బందినైనా ఎన్జీఓ నాయకులు సమ్మె నుంచి మినహాయిస్తే ప్రజలు వేయి దండాలు పెడతారు.

### ఇదొక తెలుగు స్వాహా!

వెంకటాచలం సమితిలోని గుడివింద పూడి ఇంటర్నల్ రోడ్డుకు సంబంధించి ఒక తెలుగు స్వాహా వ్యవహారం తెలియవచ్చింది!

70 వేల ఎస్టిమేషనట; కంట్రాక్టరు తెలుగుయువత కార్యకర్త వెంచుకృష్ణయ్యట; క్రాంతిపథకం క్రింద కార్యక్రమం జరిగి; 67 వేలకు బిల్లు చేశారట. పని అర్ధాన్నంగా వుంటే గ్రామస్తులు అర్జీ పెట్టుకున్నారట. పంచాయతీరాజ్ జె.ఇ. గారు పోయి తనిఖీచేస్తే జరిగినపనివిలువ 32 వేలేనని తేలిందట; దానిమీద ఎస్. ఇ. గారుకూడా మెజర్ చెక్‌చేసి జె. ఇ. గారి రిపోర్టుతో ఏకీభవించి, ఈ సంఘటనకు బాధ్యులైన డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు ఎ. వి. రావు, సమితి సూపర్‌వైజర్ కాళీపాలను వెంటనే బదలీ చేయవలసిందిగా ఛీఫ్ ఇంజనీరుకు వ్రాయగా, ఆయన వారిని గుంటూరు సర్కిల్‌కు మార్చారట.

అసలు మేము విచరం ఆ ఇద్దరిని సస్పెండుచేయమని సిఫారసుచేస్తే. ఎం.ఎల్.ఎ.ల చతుష్టయం ఒత్తిడిమీద అది బదలీగామారిందని అంటున్నారు. ఇక్కడ ఆ చతుష్టయం ఆ బదలీనికూడా రద్దుచేయించి వారిని నెల్లూరికే వేయించడానికి ప్రయత్నిస్తున్నారని వదంతి.

వీళ్ళను షత్త చతుష్టయం అనడానికి లేదు; దుష్టచతుష్టయమనడమే సరిగావుంటుంది. అయినా వీరి కార్యకలాపాలు వింటుంటే ప్రజాప్రతినిధులని పేరుపెట్టుకున్నవారు ఇంతగా పతనమైపోతారా అనిపిస్తుంది. ప్రగల్భాలు పలికిన తెలుగు దేశం ప్రభుత్వస్థితి ఇట్లాతెల్లవారింది!

నిజాయితీగా, నిర్భయంగా వ్యవహరించిన పంచాయతీ రాజ్ జె. ఇ. సుబ్రహ్మణ్యంరెడ్డి, ఎస్. ఇ. శ్రీ రాఘవులు అభినందనీయులు.

### ట్రావెల్ ఏజెన్సీ

నెల్లూరీయులకు విదేశీపర్యటనల రుచి మరపడానికి ఒక ట్రావెల్ ఏజన్సీ వెలసింది. శ్రీ సాయి ఇంటర్నేషనల్ ట్రావెల్స్ పేరుతో, ఇటీవలే మస్కట్ నుంచి తిరిగివచ్చిన యువకుడు శ్రీ పి. నరసింహం ఈఏజెన్సీ ప్రారంభించారు. పాసుపోర్టులు, వీసాలు సంపాదించి పెట్టడం, సింగపూర్ వంటి దేశాలకు టూర్లు ఏర్పాటుచేయడం వీరి కార్యక్రమమట.

నరసింహం (29) జగమెరిగిన వైశ్యుడు, పత్తి సూరికుమారుడు. వి.ఆర్. కాలేజిలో డిగ్రీ పూర్తిచేసిన తర్వాత కొన్నాళ్ళు మద్రాసులోని ట్రేడ్‌లింక్స్‌లో పనిచేశాడట. తర్వాత మస్కట్‌లోని భగవాన్ ట్రావెల్ ఏజెన్సీలో నౌకరికి కుదిరాడట. అక్కడ వుంటూనే ఇంటర్నేషనల్ ఎయిర్ ట్రావెల్ అసోసియేషన్ డిప్లొమా పొంది ట్రావెల్ కన్సల్టెంట్ పట్టా సంపాదించాడట. అట్నుంచి అమెరికా, యూరప్ వంటి దేశాలన్నీ తిరిగాడట.

### ప్రొఫెషనల్ పరీక్ష

ఎన్. జి. ఓ. ల సమ్మెతో నిమిత్తం లేకుండా ప్రొఫెషనల్ టెస్టు యధాప్రకారం 16 తేదీ ఆదివారం జరుగుతుందని; ఉదయం 10 నుండి 12-30 వరకు తెలుగువగైరాలు మధ్యాహ్నం 2 నుండి 4-30 వరకు సైన్సు, సోషల్‌స్టడీస్, జనరల్ నాలెడ్జి టెస్టులు వుంటాయని జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ మస్తాన్‌రెడ్డి తెలియజేస్తున్నారు.

### సింహపురి చోరపురి అయింది

సింహపురి పట్టణం చోరకళాప్రవీణుల ప్రజ్ఞాపాటవ పరీక్షాకేంద్రమైందా అన్పిస్తూంది. టౌన్‌లో దొంగతనం జరగని రాత్రిలేదు; దోరులు తిరగనిప్రాంతం లేదు. ఈ వారంలో ప్రతివీధి ఏదోఒక రకం దొంగతనాలకు గురైనాయి. కర్ణాల మిట్ట మిలిటరీకాలని ప్రాంతాలు మరీ దొంగ ప్రేమికులకు ఆటపట్టులైపోతున్నాయి. టౌన్‌లోని ఒక పెద్ద బ్యాంకు రీజనల్ మేనేజర్ ఇంట్లోకూడా చోరీయత్నం జరిగిందట. రామకృష్ణ నగర్ మనసులో ఒకటిరెండు చోరీలేకాక చేశారట. పోస్టల్ కాలనీ మాగుంట 'నగర్'లో కూడా పెద్ద దొంగతనాలు జరిగినట్లున్నాయి. ఏదో ముఠాయే టౌన్‌లో దిగినట్లుంది.

విచిత్రమేమిటంటే పోలీసు అధికారుల జాబితాలో ఒక్కటంటే ఒక్క దొంగతనమైనా జరిగినట్లు నమోదు కాలేదట. దొంగిలించిన వస్తువులు పోలేదు పోయాయి- మర్చి పోలీసుల 'కేసు' నెత్తికెత్తుకోవడమెందు కనుకున్నట్లున్నారు బాధితులు టౌన్ పోలీసు అసమర్థతకు. ప్రజలలో వారిపట్ల వున్న విశ్వాసరాహిత్యానికి ఈ సంఘటనలే దాఖలాలు.

### అనాధ ప్రేతం

నెల్లూరు రైల్వే స్టేషన్ ఎదురుగా, నాలుగురోజులనుంచి ఒక అనాధ ప్రేతం పడివుంది. ఈ దిక్కులేని దౌర్భాగ్యుడెవరోకాని. ప్లాట్‌ఫారం పైన ప్రాణం వదిలేశాడట! స్టేషన్ సిబ్బంది శవాన్ని తెచ్చి రోడ్డు పారేసి పోయారట. దానికి దహన సంస్కారాలు చేసేవారులేక, కుళ్లిపోయి, పురుగులుపట్టి, భరించరాని దుర్వాసన వెదజల్లుతూ నాలుగురోజులుగా అక్కడే పడివుంది ప్రేతం. ఒక ఆటో డ్రైవరు, కలెక్టరు నుంచి మునిసిపల్ కమీషనర్ వరకు అందరికీ మొరపెట్టుకున్నాడటకానీ, సమ్మెఫలితంగా దాన్ని తొలగించలేమని చెప్పారట అధికారులు. ఎంత సిగ్గుచేటో చూడండి!

### వృద్ధురాలి హత్య

నెల్లూరు పెద్దబజారులో నివసిస్తున్న మొగళ్ళూరు రాజమ్మ (60) అనే వృద్ధురాల్ని ఎవరో అతిదారుణంగా చంపారు. ఆమె ఇంట్లో ఒంటరిగా నివసిస్తూందట. 9 తేదీ ఉదయం తలుపుతీసుకుని బయటకు రాలేదనరికి, వాకిట్లోనే కత్తితో పొడిచి ఆమె పీకకోసి, ఇంట్లో వున్న 20 వేల రూపాయల విలువైన నగలు దోచుకుని పారిపోయారట డి. ఎస్. పి. శ్రీ నరసింగరావు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

ఈ కేసులో అనుమానితులను కూడా కేసుపెట్టకుండానే వదిలేశారట నే. కారణం?

### ఆళ్వార్‌గడ్డలోని పసివాని మృతి

మృత్యువు ఎప్పుడు ఏ రూపంలో ముంచుకొచ్చి ఎవర్ని కబళిస్తుందో ఎవరూ వూహించలేరు మొన్న 10తేది రంగనాయకులపేట, జనకదొంకరోడ్డులో పిచ్చమ్మ ఆళ్వార్‌గడ్డ తిని, మహమ్మద్ ముజావిర్ అనే రెండేళ్ళ పసిబిడ్డ ప్రాణాలు కోల్పోయింది.

### మరణాలు

సుశీలాదేవి

పదిహేను ఇరవై ఏళ్ళకు ముందు మైకా లేబర్ వెల్ఫేర్ ఆఫీసరుగా పనిచేసి, వుద్యోగం విరమించుకొని గుంటూరులో స్థిరపడిన శ్రీమతి గోగినేని సుశీలాదేవి (61) 9 తేదీ గుండెపోటుతో హఠాత్తుగా అసువులు బాసింది. ఆమె భర్త శ్రీ ఉమామహేశ్వరరావు పత్రికా రచయితగా వుండి, మైకా వ్యాపారియై గూడూరులో చాల సంవత్సరాలు వుండినారు. వారికి ఒకే కుమారుడు- డాక్టరు కమలేంద్ర.

సుశీలాదేవి రంగాగారిసతీమణి భారతీదేవి అక్కకూతురు: ఎం. ఎ. పట్టభద్రురాలు; రంగాగారి అభిమానపుత్రికగా పెరిగిందామె అప్యాయత, ఆత్మీయతలతో నిండిన అమృత హృదయంతో ఎప్పుడూ నవ్వుతూ గలగల మాట్లాడుతూ చైతన్యవంతంగా వుండేది సాధ్వి సుశీలమ్మ.

-తరువ 7 వ పేజీలో

# జిల్లావార్తలు

(1 వ పేజి తరువాయి)

కాలేదు. ఆ సుమన్న వినాశనం కళ్ళారా చూస్తూ వుండిపోయారట.

ఇటువంటి దుర్మార్గం జరిగినంతటి దుస్సాహసమైన అలక్ష్యం జరగకుండా ఇంజనీర్లకు పనులు చేయడం, వర్షంతో కలిగిన కట్టల గండ్లపైన, ప్రజలపైన, నీటి పారుదల వ్యవస్థపైన ఎంతటి శ్రద్ధతో తెలుసుకోవడానికి ఈ నిదర్శనం చాలు. ఇటువంటి సంఘటనలలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన అధికారులను శిక్షించే రోజులు ఎప్పుడువస్తాయో!

### జిల్లా జువెలర్స సంఘం

నెల్లూరు జిల్లా జువెలర్స సంఘం అనే పేరుతో నూతన సంఘం ఆవిర్భవించింది. దీనికి గౌరవాధ్యక్షుడు శ్రీ తుంగా రాజగోపాలరెడ్డి, అధ్యక్షుడు శ్రీ కందుకూరు వెంకటసుబ్బయ్య, ఉపాధ్యక్షుడు కోవూరి చినవెంకయ్య, కార్యదర్శి కె. పట్టాభి, సహాయ కార్యదర్శి శ్రీ ఎం. అరుణాచలం, కోశాధికారి శ్రీ కె. పోతరాజు.

### ఇందుకూరుపేట టీచర్లు

ఎ. పి. టీచర్స్ ఫెడరేషన్ ఇందుకూరుపేట సమితి శాఖకు నూతన కార్యవర్గం ఎంపికైంది. అధ్యక్షుడుగా శ్రీ వి. నాగరాజారావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ డి. కోటయ్య, కార్యదర్శులుగా సి.హెచ్. హరగోపాల్, పి. రాయప్ప, ఎమ్. వరనయ్య, కె. శ్రీనివాసమూర్తి, ఆ. రమణయ్యనాయుడు ఎన్నికైనారు.

### గూడూరు మరణం

నెల్లూరు జిల్లాలో వాసిగాంచిన, సబ్ మేజిస్ట్రేట్‌గా 35 సంవత్సరాలకు పైగా పనిచేసి, అందరి ప్రశంసలకు పాత్రులైన మంచి మిత్రుడు శ్రీ వల్లూరు కొండయ్యనాయుడు (80) 6 తేదీ పరమపదించారు. ఆయనకు నలుగురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. డాక్టర్ భుజంగేంద్రరావు, న్యాయవాది శ్రీ వి. జి. ప్రసాద్ ఆయన కుమారులే!

### మైకా పదవి

గూడూరు మైకా మజ్దూర్ సంఘం అధ్యక్షుడు, వి. జె. పి. కార్యదర్శి శ్రీ కమ్మిటి వెంకటసుబ్బయ్యను రాష్ట్ర మైకామైన్స్ లేబర్ వెల్ఫేర్ ఫండ్ సలహా సంఘానికి సభ్యుడుగా నియమించారు. ఆయనతోపాటు, కళ్యాణరామ మైకా మైన్ కార్మికురాలు శ్రీమతి కాళహస్తి యశోధరమ్మకూడా ఈ పదవిలో నియమితురాలైంది.

### జనవాణి

(3 వ పేజీ తరువాయి)

వహించడంలేదు.

కాబట్టి, జిల్లా వైద్యశాఖాధికారులు పల్లెలలో శిబిరాలను ఏర్పాటుచేసి మందులను పంపకపోగా వ్యాధి నిర్మూలనకు తీసుకోవలసిన జాగ్రత్తలు తెలియజేయాలి అవసరమైతే నిరుద్యోగ యువకులను ఈ పనికి వినియోగించుకోవచ్చు. వారిద్వారా వ్యాధి వచ్చేందుకు కారణాలు, లక్షణాలు, వ్యాధికి ముందు తీసుకోవలసిన జాగ్రత్తలు, నివారణోపాయాలు, వ్యాధిని అరికట్టే విధానం అందరికీ వివరిస్తే బాగుంటుంది.

నరుకూరు — ఎస్. శశికళ

### శభాష్ రాజీవ్‌గాంధీ!

ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ, పరిపాలనాదక్షుడు, ఆంధ్రుల అభిమాన రాజకీయ నాయకుడైన శ్రీ జలగం వెంగళరావుకు కేంద్రంలో పరిశ్రమల శాఖా మంత్రి పదవి ఇవ్వడం హర్షించదగిన విషయం.

శ్రీ జలగం వెంగళరావు రాష్ట్రముఖ్యమంత్రిగా ఎన్నో మంచిపనులు చేసి ప్రజల మెప్పు పొందారు. అలాగే పిసిసి అధ్యక్షుడుగా రాష్ట్ర కాంగ్రెస్ పటిష్టత కోసంఎంతోకృషిచేశాడు ఆయనకు కేంద్ర మంత్రిపదవి తగినదే. అందుకు ప్రధాన మంత్రి అభినందనీయుడు.

పదవిలోవున్నా, లేకున్నా కాంగ్రెస్ పార్టీకోసం, పార్టీ అభివృద్ధికోసం నిరంతరం శ్రమిస్తున్న రాష్ట్ర కాంగ్రెస్‌నాయకుడు శ్రీ జనార్దనరెడ్డిని పి సి సి అధ్యక్షుడుగా నియమించాలని కాంగ్రెస్ అభిమానిగా కోరుతున్నాను

కలిచేడు — ఎస్. మహబూబ్‌బాషా

### మెదడువాపుకు పత్రికా ప్రకటనలా?

నెల్లూరు తిక్కమిట్ట ఆశోక్‌నగర్ ప్రాంతాలలో పందులు స్వైర విహారం చేస్తున్నాయి. అక్కడుండకూడా అవి నిర్భయంగా తిరగాడుతుంటాయి. అంతే గాక దోమలుకూడ ఎక్కువగనేవున్నాయి. వర్షంవస్తే చెప్పనే అవసరంలేదు రోడ్డంతా బురదమయం దానితోడు వీధిలైట్లు కూడా సరిగా వెలగడంలేదు. జిల్లా అధికారులు ఇవేవి పట్టించుకోవడం లేదు. మెదడువాపువ్యాధిని గురించి పత్రికా ప్రకటన ఇవ్వడంతప్ప, నివారణ చర్యలు విస్తృతంగా చేపట్టడంలేదు. టౌన్ సంగతే పట్టించుకోకుంటే, ఇక పల్లెల సంగతి పట్టించుకొనేనాధుడెవరు?

— పొన్నలూరు శివకోటారెడ్డి

మాచర్లవారిపాళెం

### కావలి

(5 వ పేజీ తరువాయి)

వచ్చి కూర్చున్నది. రామకోటారెడ్డిని చేర్మన్ చేయాలనే తలంపు ఒక్క తెలుగు దేశంలోనే కాకుండా, పార్టీ రహితంగా ఆయన "బాధు"వర్గమంతటా వుండటం పేరు పొడుగుదైనా రెండక్షరాల పొట్టి పేరుతో పిలువబడే ఒకానొక పెద్ద ఇందుకోసమై కాంగ్రెస్ ఎమ్మెల్యే శ్రీ యానాది రెడ్డితో తనకున్న విభేదాలు విస్మరించి టెలిఫోన్‌లో అభ్యర్థన చేశాడట.

కానీ యానాదిరెడ్డి సంగతి ఎవరికి తెలియదు; ఉడుం పట్టుకున్నా దొరకకుండా జారిపోయే తత్వం ఆయనది. అసలు ఈ ఎన్నికలలో తన స్వంత అభ్యర్థిని తప్ప ఎవరిపెళ్ళికో పెత్తనం వహిస్తాడనుకోవడం మూర్ఖత్వమే అవుతుంది. ఆయన హృదయకుహరంలో ఈ పాటికే పెళ్లికుమారుడి నిర్ణయం జరిగిపోయివుంటాలి కాని, ఆరహస్యం బయటపడడంలేదు; అయితే కాంగ్రెస్‌పార్టీ తరఫున ఒకవైస్ఛైర్మన్‌కి ఛాన్సు తగలవచ్చు ననిమాత్రం ఊహాగానాలు జరుగుతున్నాయి. వైస్ఛైర్మన్ ఎవరో కావలియులకు ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదుకదా!

అసలు కావలి సీటుకు 3 జ ర్వుడు నుంచి జనరల్‌కు మారుస్తారా లేదా అన్నది పెద్ద సందేహం. మారిపోతుందని, మారిపోయిందని పుకారులు తప్ప, అధికారికంగా ఇప్పటివరకు ఎటువంటి సమాచారం లేదు. అయితే పురపాలక సంఘం వార్డుల సంఖ్య మాత్రం 14 నుంచి 28 వరకు పెరిగిందట. ★

### దువ్వూరు రామిరెడ్డి

(5 వ పేజీ తరువాయి)

క్రితికి ఆవిష్కరణ జరిగింది. శ్రీ గునుపాటి వెంకటరమణారెడ్డి ట్రస్టు కమిటీ దీనికి ఆర్థిక సహాయం అందజేసిందట; పుస్తక ప్రచురణ హక్కులను రామిరెడ్డి గారి కోడలు శ్రీమతి దువ్వూరు సరస్వతమ్మ, మనుమడు శ్రీ వెంకటరామమోహన విజ్ఞానసమితి పరం చేశారు. పుస్తకం అమ్మగా వచ్చిన డబ్బును, సమితి కార్యకలాపాలకే వాడుతారట.

సభను తొలుత సమితి అధ్యక్షులు, అడ్వొకేట్ శ్రీ పి వి. రమణారెడ్డి స్వాగతించి, కవికోకిల జయంతి సభల పూర్వాపరాలు వివరించారు; వర్తమాన సమాజం కార్యదర్శి శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి వందనాలు చెప్పారు. ★





●●●● శ్రద్ధాంజలి

మా తండ్రి

## డా. జొన్నలగడ్డ నారాయణయ్యగారు

7.11.86 తేది శుక్రవారం స్వర్గస్తులైనారు. వారి పవిత్రాత్మకు శ్రద్ధాంజలి ఘటిస్తూ

వారి దశాహస్సు 16-11-86 తేది

నెల్లూరు స్వతంత్రపార్కురోడ్డులో స్వగృహమున జరుగును, కాన తెలుపడమైనది.

జననం : 28-12-1919

నిర్యాణం : 7-11-1986

డా. జొన్నలగడ్డ రామమోహన (కుమారుడు) డా. వాణి (కోడలు)

జొన్నలగడ్డ కృష్ణప్రసాద్ (కుమారుడు)

కుమార్తెలు : జి. యశోధర — డా. యస్. గిరిజ — పి. రాజ్యలక్ష్మి

అల్లుళ్ళు : జి. ఎస్. ఆర్. మూర్తి — డా. ఎస్. వి. రామన్ — పి. పూర్ణచంద్రరావు

## సినిమా

(9 వ పేజీ తరువాయి)

అనివార్యంగా పున్న పాటల ప్రభావం మీద పెట్టిక లేదు.

### ప్రతిభాధిపతులకు ఆంధ్ర విశ్వవిద్యాలయంచే గౌరవం

ఒకరు సినిమా రంగం నుంచి పత్రికా రంగంలోకి వచ్చారు. మరొకరు పత్రికా రంగంలోంచి సినిమా రంగంలోకి వచ్చారు. మొదటి ప్రముఖుడు దాసరి నారాయణరావు. రెండవ ప్రముఖుడు, 'ఈనాడు' రామోజీరావు. దాసరికి 'కళా ప్రపూర్ణ', రామోజీరావుకు "డాక్టరేట్" గౌరవాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇచ్చింది.

### "హెచ్చరిక" నిర్మాతల తదుపరి చిత్రాలు

వచ్చే సంవత్సరం వెంకటేశ్‌తో, ఆ తర్వాత నాగార్జునతో నిర్మించిన చిత్రాలకు కె.మురళీమోహనరావు, బి గోపాల్ దర్శకులు, సమర్పణ: వి సాంబిరెడ్డి, నిర్మాతలు: ఎస్. విఠల్‌రెడ్డి, ఎ. కోటారెడ్డి.

### డిసెంబర్ 10 న ఎస్. గోపాల్‌రెడ్డి కొత్త చిత్రం

భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "ముద్దుల కృష్ణయ్య" కొన్ని కేంద్రాలలో 250 రోజులు దాటి స్వర్ణోత్సవానికి పరుగులు తీస్తోంది. "మన్నెంలో మొనగాడు" చిత్రానికి నంది అవార్డు వచ్చింది. కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. గోపాల్‌రెడ్డి నిర్మించే కొత్త చిత్రానికి డిసెంబర్ 10 న రికార్డింగ్ కార్యక్రమం, జనవరి 10 న షూటింగ్ ప్రారంభమవుతాయి. ఇందులో బాలకృష్ణ, విజయశాంతితో పాటు మరొక ప్రముఖ తార కూడా వుంటుంది. చక్కని కథను ఎన్నుకోవడం, క్రమబద్ధతతో చిత్రనిర్మాణ కార్యక్రమాలను జరపడం గోపాల్‌రెడ్డి ప్రత్యేకత. అందుకే అత్యల్పకాలంలో గొప్ప హిట్ చిత్రాలు నిర్మించి, తనకు తానే సాటి అనిపించుకున్నాడు.

### పోలీస్ స్టేషన్‌లో యువతికి గండం

సంచలనాత్మక చిత్రాల ముసిర్మాతగా రూపొందించడంలో "ఈనాడు" రామోజీరావు తర్వాతే ఎవరైనా. "ప్రతిఘటన" లాగే ఈ యువ తార చిత్రం "పూజకు పనికిరాని పువ్వు" కూడా గొప్ప హిట్ అవడానికి ఎన్నో అంశాలున్నాయి. ఇది వ్యభిచారిణులకు సంబంధించిన ఇతివృత్తం. కంచే చేనుమేస్తే అన్నట్లు ప్రజలను రక్షించవలసిన పోలీసులే భక్షకులైతే! ఇటీవల పోలీస్ స్టేషన్లలో లాకప్ మరణాలు, మాన భంగాలు తరచు జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. రామోజీరావు చిత్రంలో పోలీస్‌స్టేషన్‌లో ఒక అభాగిని జుట్టు కత్తిరించి, బోడిగుండు చేస్తారు పోలీసులు. ఇలాంటి సన్నివేశాలెన్నో వున్నాయి ఈ చిత్రంలో. ★

### ఆర్టీసి బస్సులు

(4 వ పేజీ తరువాయి)

అరనపు భారం విధిస్తే ఎట్లా? దీనివల్లనే ప్రైవేటు బస్సులు కిటకిటలాడుతూంటే, ఆర్టీసివారు ఖాళీసీట్లతో వట్టి బస్సులు త్రిప్పుతున్నారు.

కండక్టర్లు కొత్త కావడంవల్లకూడా కొన్ని ఇబ్బందులెదురౌతున్నట్లున్నాయి. స్టాపులో పదిమంది ఒక్కసారి ఎక్కితే, సరసరా టిక్కెట్లు చించడం చేతకాక, బస్సు నిలిపేస్తున్నారట. వేళల నిర్ణయం కాకపోవడంకూడా ఒకలోపం. ఏ నంబరు బస్సు ఎన్నిగంటలకు ఎక్కడ బయల్దేరుతుందో, ఎక్కడ నిలుస్తుందో సిబ్బంది చెప్పలేకపోతున్నారు. దీనివల్ల, ప్రయాణీకులు ఆ బస్సుకోసం ఎదురుచూడకుండా ప్రైవేటు బస్సు రాగానే ఎక్కి కూర్చుంటున్నారు.

బస్సులన్నీ సింగిల్ డోర్‌వి కావడం ఇంకొక ప్రధాన ఇబ్బంది. ప్రయాణీకులు ఎక్కడానికి దిగడానికి ఒకేదారి కావడంతో చాలా అసౌకర్యంగావుంది టౌను బస్సులు జారీయం చేసేముందు, అందుకనుగుణమైన డిజైన్‌లో బస్సులను ముందుగా తెప్పించి పెట్టుకోవలసింది. అది లేకుండా వున్నవాటిలో టౌను సర్వీసులు నిర్వహిస్తే ఇటు సంస్థకు అటు పౌరులకు కూడా అసౌకర్యమే.

పట్టి అసౌకర్యమేకాదు - ఈ నిర్లక్ష్య ఫలితాన్ని ఆర్‌టిసి బాగానే చవిచూస్తుంది. ఛార్జీలు అధికం కావడం, వేళలు నిర్ణయం కాకపోవడం, స్టాపుల్లో సక్రమంగా ఆగకపోవడం వంటి కారణాలవల్ల ఒక్క బస్సుకూడా ప్రయాణీకులతో నిండడంలేదు, ఖాళీగా తిరుగుతున్నాయి. ఇప్పటికైనా మించిపోయిందిలేదు - అధికారులు శ్రద్ధ తీసుకుని ప్రైవేటు బస్సులతో సమానంగా రేట్లు తగ్గించి, వేళలు సక్రమంగా నడిపితే ప్రయాణీకులకు ప్రైవేటుబస్సుల జోలికి పోవలసిన అగత్యంరాదు. ★

## న్యూస్ పాయింటు

### కలెక్టరాఫీసు గేటు!!

ఎన్నాళ్ళకెన్నేళ్ళకు
మరలా తెరుచుకున్నది
కలెక్టరాఫీసు మెయినుగేటు!!
జన్మభూమిస్వేచ్ఛ హయాంలో
కావిముక్తిని పొంది
సంతరించుకుంటూన్నది
దాని పూర్వవైభవపు దీటు!!!

### మండల ఎన్నికలు!!

మార్చిలోగా
మండలాల ఎన్నికలు!
మాతీల మనస్సుల్లో
ఎన్నెన్నో కలలు!!
ఆరుకోట్ల ఆంధ్రుల
ఆలోచనల్లో కనిపిస్తునది మార్పు....
అన్నగారి అనుచరుల్లో
నశిస్తున్నది: ఓర్పు....

### చాచా నెహ్రూ!!

నీ వ్యక్తిత్వం:
హిమాలయ శిఖరోన్నతం!
నీ మనస్తత్వం:
అతిసున్నితం
నవ్యనవనీతం!!
నీవు ఎగరేసిన శాంతికపోతాలు
దిగంతాలకు పయనిస్తున్నాయ్!
నీవు రూపకల్పనచేసిన
అలీనోద్యమం; నేల నాలుగు
చెరగులకు విస్తరిస్తూన్నది;
నవంబరు పద్నాలుగు
బాలల హృదయాల్లో
విజ్ఞానదీధితులు వెలుగు
నేటి బాలలం! రేపటి పౌరులం!!
చాచా నెహ్రూ! అందుకో మా జేజేలు!!!

(నవంబరు 14 పండిత జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినం)

-వేపకొమ్మ

### చిత్రసమీక్ష

(9 వ పేజీ తరువాయి)

ల్సిన కలిసిన జాగ్రత్త లు తీసుకున్నట్లు కనపడదీ చిత్రంలో!

నటుడిగా నారాయణమూర్తి లోని సిద్ధమైన కోంకర పాటు కనం (ఆవేశం-ఆవేదన), ప్రభావం కృతి పాత్రలోను కనిపిస్తుంది చిత్రంలో ఆయనే దర్శకుడు కావడంతో డైలాగ్ యూనిఫాంతో సహా కాల్పులు జరుపుతున్న ప్రాంతానికి రావడం, ఒక్కడే వాగ్యుద్ధంతో ఆ పాత్ర ఔచిత్యం చెబుతున్నది.

ఓ చిన్న బ్యాయి ఎర్రరంగు గుడ్డను కట్టుకోవడంతో చిత్రాన్ని ముగించారు దర్శకుడు. విప్లవం ఆగదని చెప్పేదానికి సంకేతంగా! విప్లవాన్ని సృష్టించడంలోనే విఫలుడైన దర్శకుడు రూపొందించిన ఈ సన్నివేశం మాత్రం నిండుగావుంది. సినిమాపేరుకు ఇతివృత్తానికి సంబంధమే లేకుండాపోయింది కథనంలో!

మన్యెందొరగా రాళ్ళపల్లి వేషంలోనే కృత్రిమత్వం చోటుచేసుకుంది, ఇక భాష మహానగర భాషే! విప్లవకారుడిగా టి. కృష్ణ 'డబ్బింగ్' కోతంతో, పెదాల కదలిక, మాట్లాడే మాటల్లో తేడా కన్పిస్తుంది. యువకులకు నటించాల్సినపాత్ర ఇవ్వలేదు దర్శకుడు.

వంగపండు పాటలన్నీ అస్పష్టంగా, అగమ్యగోచరంగా ఉన్నాయి సత్యం సంగీతంకూడా చిత్రానికి విలువ పెంచడంలో సహకరించలేకపోయింది. ★

### నెల్లూరు సంగతులు

(4 వ పేజీ తరువాయి)

మందిరంలో జనవరి 20 తేది నుండి 22 వరకు త్యాగరాజ ఆరాధనోత్సవాలు జరుగుతాయట. గాత్రం, హరికథలు, వాయిద్యాలలో ప్రవేశమున్న స్థానిక కళాకారులు డిసెంబరు 20 తేది లోపల దరఖాస్తులు ఎ. యస్. గుప్త, జాయింట్ సెక్రటరీ, 23/87 రామనగర్, నెల్లూరు-2 కు పంపాలని తెలియచేస్తున్నారు.

### కళాభారతి సంగీతోత్సవం

సాంస్కృతిక సంస్థ కళాభారతి, సంక్రాంతి సందర్భంగా జనవరి 13 తేది టౌనుహాల్లో రాష్ట్రస్థాయి కర్ణాటక సంగీత పోటీలు నిర్వహిస్తుందట పోటీలో పాల్గొనేవారు పది రూపాయలు ప్రవేశ రుసుం చెల్లించాలట, ఇతర వివరాలకు ఎం. శంకరప్రసాద్, 15/539 ఒక్. ఆర్ స్ట్రీట్, నెల్లూరును సంప్రదించండి.









నెల్లూరు జిల్లా జడ్జి కోర్టులో
O. P, No. 522 of 86

1. జి. సులోచనమ్మ. 2. కె భాగ్యలక్ష్మి, 3. జి. పద్మావతి, 4 శశిభూషణ్
-పిటిషనర్లు

1. దేశయ్య మరియు వగైరాలు-
-రెస్పాండెంట్లు

జనరల్ నోటీసు

ఇందుమూలముగా యావన్మందికి తెలియచేయడమేమనగా ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని అమ్మి, 4వ పిటిషనరు మైనరు అయినందున అతనికి వచ్చు భాగము కోర్టులో డిపాజిట్ చేయుటకు పై కోర్టులో పిటిషనర్లు పిటిషను దాఖలుచేసియున్నారు. ఎవరికైనా ఆక్షేపణలు వున్న యెడల పై కోర్టులో 20-11-86 తేదిన ఉ. 10-30 గంటలకు హాజరై ఆక్షేపణలు తెలుపుకొనవలసింది లేనిచో మీ పరోక్షమున కేసు తీర్మానించబడును.

షెడ్యూలు

నెల్లూరు జిల్లా, గూడూరు సబ్ రిజిస్ట్రేషన్ గూడూరు టౌను వార్డు నం 8/81 (కొత్త నం 7/102) పోర్టువాకవీధిలో వున్న 20 అంకణాల ఖాళీస్థలంలో 12 అంకణాల పెంకటిల్లు, 1½ అంకణాల బాదు కలిగివున్న ఇంటికి హద్దులు:
(తూ) పి వెంకటేశయ్య ఇంటిస్థలం,
(ద) ముక్కాల దేశయ్య ఇల్లు, (ప) కల్లారెడ్డి శ్యామసుందరరెడ్డి ప్రహరిగోడ (ఉ) పి. వెంకటేశయ్య ఇల్లు.

-యం. లీలామోహన
-డి. విష్ణుప్రసాదరెడ్డి
పిటిషనర్ల తరఫు అడ్వకేట్లు



## కళాభారతి - నెల్లూరు

### సంస్మరణ సభ

గొప్ప సాహితీవేత్త

**డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారి**

సంస్మరణ సభ జిల్లా జడ్జి శ్రీ బి. శివసాంబమూర్తిగారి అధ్యక్షతన 18-11-86 తేది సాయంత్రం 6-30 గంటలకు నెల్లూరు టౌన్ హాలులో జరుగును. సోదర సాంస్కృతికసంస్థలు ప్రజలు విరివిగా పాల్గొని ఆ మహామనీషికి నివాళులర్పించమని విజ్ఞప్తి చేస్తున్నాను.

-యం శంకరప్రసాద్, అధ్యక్షులు.

# 85వ ఏట లేబూరు ఆదిశేషారెడ్డి కన్నుమూత

● మా ఇంటి పెద్దతలకాయ రాలిపోయింది ● మాకు వెలుతురిచ్చిన దీపం ఆరిపోయింది

ఆత్మాభిమానం తలగుత్తగా పట్టుదల తన చేతి తుపాకిగా ధరించి నిరాడంబరంగా జీవించిన పెద్దమనిషి.

## లేబూరు ఆదిశేషారెడ్డి 12-11-86 తేదీన కాలధర్మంచెందినారు

చిన్నతనంలోనే తన తల్లి బంగారు ఆభరణాలను మహాత్మాగాంధీ దోసిట్లో పెట్టిన అజ్ఞాత దేశాభిమాని ఖద్దరుతోనే పెరిగి,
ఖద్దరుకప్పుతోనే జీవయాత్ర ముగించిన దేశభక్తుడు,

ఆయన మా ఇంటిలో నీతి, నిజాయితీ. సంస్కారము మొక్కలను నాటినారు. వాటిని
పదిమందికి పనికివచ్చేవిధంగా పెంచడమే మా జీవితగమ్యం.

## పెద్ద కర్మ తే 26-11-1986 ది బుధవారం

లేబూరు శ్రీదేవమ్మ (ధర్మపత్ని) యల్. వి. కృష్ణారెడ్డి (కుమారుడు) అనూరాధ (కోడలు)

స్థలము : ఇంటి నెం. 2/65, భాస్కరరావు వీధి, నవాబుపేట (లైబ్రరీ ఎదురువీధి).

---

# శ్రద్ధాంజలి

మా అభివృద్ధికి కారకుడు
మమతానురాగాలతో మమ్మల్ని
కంటికిరెప్పలా కాపాడిన పుణ్యపురుషుడు

## కాకుటూరు చంద్రారెడ్డి

'86 నవంబరు 9 తేది ఆదివారం వేకువన పరమపదించారు
ఆయన ఆత్మకు భగవంతుడు శాంతి ప్రసాదించాలని
ప్రార్థిస్తున్నాము.



## ఉత్తర క్రియలు

18-11-1986 తేది మంగళవారం విలువు
19-11-1986 తేది బుధవారం ఎత్తురేవు
నెల్లూరు, జేమ్సుగార్డెన్ (డోర్ నం. 16/808) లోని
మా ఇంట్లో జరుగుతాయి. ఇదే ఆహ్వానము తెలియచేయడమైనది.

ప్రసూన (కుమార్తె) కె. సురేఖ (కోడలు)
కాకుటూరు వజ్రావతమ్మ (భార్య)
డాక్టర్ కె. అరవిందరెడ్డి, (కుమారులు) కె. శంకరరెడ్డి

Edited, Printed & Published by N. Sree Ramamurthy at the Zamin Ryot Press, 170, Thipparajuvari Street, Nellore (A. P.)